గురుదేవుని గ్రంథమాల : ౧ వెల : ౧-౮-౦

# దేవయాని - చిత్రాంగద

(బెంగాలినుండి అనువదింపబడిన నాటికాద్వయము)

శ్రీ రవీంద్రనాథ ఠాకూరు

అనువాదకులు :
బెజవాడ గోపాలరెడ్డి



కృష్ణాపత్రికాధిపతులు :
శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి
తొలిపలుకులతో సహా

త్రివేణి పబ్లిషర్సు
మచిలీపట్టణము

ii

ప్రథమ ముద్రణము : సెప్టెంబరు ౧౯౪౪
ద్వితీయ " మే ౧౯౫౩

---

## శ్రీ రవీంద్రుని జీవిత ఘటనలు :—

జననము : మే ౧౮౬౧ క్రీ॥ శ॥

జనకుడు : శ్రీ మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు (౧౮౧౭—౧౯౦౫)

జనని : శ్రీ శారదాదేవి (౧౮౨౪—౧౮౭౫)
౧౫ మందిలో ౧౪ వ బిడ్డ రవీంద్రుడు.
౮ వ పుత్రుడు.

ప్రథమ పద్య కావ్యము : సెప్టెంబరు ౧౮౭౮
౧౮౭౩ సం॥ నుండియే నాటకముల పద్యముల రచించుచుండెను.

వివాహము : డిసంబరు ౧౮౮౩

భార్య : శ్రీ మృణాలినీ దేవి
నవంబరు ౧౯౦౨ లో చనిపోయెను.

శాంతినికేతన స్థాపన : డిసంబరు ౧౯౦౧

స్వీడిష్ నోబెల్ బహుమానము : నవంబరు ౧౯౧౩ గీతాంజలికిగా లక్ష యిరువదివేల రూపాయలు

విశ్వభారతి స్థాపన : డిసంబరు ౧౯౨౧

మరణము : ఆగస్టు ౭, ౧౯౪౧

---

ది జ్యూపిటర్ ప్రెస్ లిమిటెడ్, 16, సెంబుదాసు వీధి, మద్రాసు - 1

ప్రేమతో

శుభ ఆశీస్సులతో

మా

అనసూయకు

శకుంతలకు

లాభము—

ఆంధ్రదేశమున రవీంద్ర సంస్కృతిని
వ్యాపకమొనర్చుటకై వినియోగింపబడును.



శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిచే అనువదింపబడి
ప్రచురింపబడిన రవీంద్రుని పుస్తకములు.

| | |
|---|---|
| ౧. దేవయాని - చిత్రాంగద | సెప్టెంబరు ౧౯౪౪ |
| | (ద్వితీయ ముద్రణ మే ౧౯౫౩) |
| ౨. ఆరు నాటికలు | జనవరి ౧౯౫౧ |
| ౩. ఊర్వశి | పిబ్రవరి ౧౯౫౩ |
| ౪. విసర్జన | పిబ్రవరి ౧౯౫౩ |
| | (మొదటి ముద్రణ ఏప్రిల్ ౧౯౪౬) |

ప్రచురింపబడనున్నవి :—

కథలు - కల్పనలు
మాలిని - సన్యాసి
నైవేద్యము - స్మరణ
లిపిక

# విన్నపము

రవీంద్ర జయంతినాడు దేవయాని - చిత్రాంగద ద్వితీయ ప్రచురణ ఆంధ్ర రసజ్ఞులకు యివ్వగలుగుచున్నందులకు సంతసించుచున్నాను. ఈ రెండు కావ్య - నాటికలు రవీంద్రుని యౌవనదశలో రచింపబడినవి. చిత్రాంగద ముప్పదవయేట, దేవయాని ముప్పదిరెండవయేట. రవీంద్ర సాహిత్యములో యివి రెండును - ముఖ్యముగ చిత్రాంగద - ప్రముఖ స్థానము వహించినవి.

ప్రేమ ఉపక్రమణకు సమ్మోహిత మొనర్చు యౌవన సౌందర్యము అవసరమనియు, తరువాత ఆ సౌందర్యము జీర్ణించిపోయినను ప్రేమ నిలిచి యుండగలదు అను భావమును చిత్రాంగదలో రవీంద్రుడు నిరూపించెను. ప్రియుడు లాలించి సల్లాపించు రమణి తన బాహ్య శరీర సౌందర్యముపై యీర్ష్యనుగాని తాను వేరనియు ప్రియాదరణములు తన్నుపేక్షించి తన తరుణలావణ్యమునే ఉపలక్షించినవని తలచిన ఎట్టి ఖేదమును పొందునో ఆ భావమును చిత్రాంగదయందు కవి చిత్రముగ వర్ణించియున్నాడు. కురూపి చిత్రాంగద అర్జునునిచే తిరస్కృత యాయెను. మదనవసంతుల వరప్రాప్తమైన చిత్రాంగద సురూపమును అర్జునుడు మోహించి పదానీతుడాయెను. ఒకవత్సరకాలము యిద్దరును ఆ మోహ జీవితమును గడపిరి. చిత్రాంగదను యీ అంతర్వేదన వీడలేదు. అర్జునుడు లాలించునది ఆమె ఛద్మరూపమేనని ఆమె మాయాసౌందర్యమేనని ఆమె మనఃఖేదముపడి కడకు ఆ మాయాలావణ్యము మాయముకాగా నిజరూపమున అర్జునుడామెను అంగీకరించి "నేడు నేను ధన్యుడను" అని తన ప్రణయభరిత హృదయమున ప్రేమసిద్ధిని ప్రకటించెను. దేహము పరాజితమై ఆత్మ విజయము పొందెను.

౧౯౪౩ లో నేను వెల్లూరు జైలులో డిటెన్యూగ ఉన్నప్పుడు అనువదించిన యీ కావ్యనాటికలు తొలుత ౧౯౪౪ లో ప్రచురించితిని. దీనిని పాఠకులు ఆదరించబట్టియే నేనిప్పటికి నాలుగు పుస్తకములు గురుదేవ గ్రంథమండలిలో వెలువరించగలిగితిని.

శ్రీ ముట్నూరి కృష్ణరావుగారి "దర్బారు" లో దీనిని చదువగా విని ప్రోత్సహించి పరిచయ వాక్యముల తమ దివ్యలేఖిని వ్రాసి యిచ్చిన వారికిపుడు మరొకసారి నమస్కృతు లందించుచు వారు మన మధ్య లేనందుకు విచారించుచున్నాను.

ఈ ప్రచురణయు ఆంధ్ర రసజ్ఞుల మన్నన పొందుగాక.

సుదర్శనమహల్
నెల్లూరు
రవీంద్ర జయంతి దినము
మే ౭, ౧౯౫౩

బెజవాడ గోపాలరెడ్డి

## SOME OPINIONS

Chitrangada, a drama, which was written during the songtide, and is itself an epitome of all the songs he ever sang, a glorious thing throbbing with lyrical power and beauty. This is englished as 'Chitra' and the reader can see how masterly it is in whole and detail. It is one of the summits of his work, unsurpassed and unsurpassable in its kind. ...... The poet for once was so captured by the loveliness of his own imagination that he wrote a play which is sufficient in itself.

E. J. THOMPSON.

*(Rabindranath Tagore—The Heritage of India series)*

* * *

From the point of view of evolution "Chitrangada" was a dead end. He never produced more richly sensuous poetry before or after. No translation can give an idea of its extravagance of images and metaphors, its plenitude of lyric sentiments and its rich melodic pattern. But the body-soul conflict was there, and it was resolved on behalf of the soul.

PROF. DHURJATI PRASAD MUKERJI.

*Tagore—a study—Padma publication.*

# విషయసూచిక



# పరిచయ వాక్యములు

ఏ వినీలాకాశ గర్భమునుండి, ఏ యుగారంభ సంరంభమున, భారత పరిజ్ఞానామృతము అవనికి దిగివచ్చెనో, ఎవరు చెప్పగలరు? ఇయ్యది కాలమువలెనే అనంతము!—ఆకసమువలెనే సర్వవ్యాప్తము!!

కొండొక కాలమున ఉషఃకాంతులు తమస్సులను జీల్చుకొనుచు చేతనాచేతన ప్రకృతిని మేల్కొలుపుచుండ; మన పూర్వులు విస్మయానందముల నోలలాడుచు, మంచుతెరల చాటున మూర్తులుగనో, అమూర్తులుగనో, దృశ్యాదృశ్యముగ గోచరించు జగదంతర ప్రవర్తకులైన దేవతల పరిచయము గావించుకొని ఋక్సామములలో ఉద్గీథములను బాడ దొడగిరి.

క్రమముగా—దేశకాలముల ఎల్లలుకూడ దాటి, అవాఙ్మానస గోచరమైన అఖండ సచ్చిదానందమును స్పృశించి—ఔపనిషదిక రహస్యములను ముక్తకంఠముతో నుద్ఘాటించిరి.

అటుపిమ్మట, భారత విజ్ఞాన మహాతరంగిణి జాహ్నవివలె హిమాలయోత్తుంగ శృంగములనుండి దుమికి, సాంద్రారణ్యముల నిబిడ చ్ఛాయల విశ్రమించుచు, మానవలోకమునందు ప్రవహించి, మానవుని కల్యాణగుణములను మూర్తీభవింపజేసుకొనిన అవతార పురుషుల లీలా విలాసములను బ్రతిఫలింపజేయ, పురాణేతిహాసములను జిత్రించిరి.

అంతెక్కడిదీ జ్ఞానధారకు? ఒకప్పుడు జ్యోత్స్నావీచికయై, శుభ్ర హిమఖండములతో క్రీడించుగాక! స్నిగ్ధజాహ్నవియై గగనచుంబిత

శృంగములనుండి ఉరికి వనాంతర సీమలయందు విజయ విహార మొనరించుగాక!

మరి ఒకప్పుడు ఆ అమల విమల వాహిని రాజాధిరాజుల నికటము ననో, జనపదముల చెంతనో, శీతకణములను వెదజల్లుచూ మానవుని సేద దీర్చుచుండుగాక! కాని ఈ వాహిని అవిచ్ఛిన్నము, లోకసంతాప హరము, బ్రహ్మానంద సంధాయకము.

* * *

దీని నిర్మాణశక్తియు అత్యద్భుతము! ఇయ్యది పర్వతశ్రేణులను సహితము తొలచి, అందు విజ్ఞాన దీపములను వెలిగించినది. సాంద్రా రణ్యములలో ఆశ్రమములను, పర్ణకుటీరములను నెలకొల్పి తత్వసారమును చిలికించినది.

కవి బృందములను సృష్టించి, వారి కావ్యరంగములపై దివ్య సుందరియై నర్తించినది. శిల్పభూములలో పసిడి తళుకుల గోపురములను నిర్మించుకొని, నీరాజనములతో కళారాధనల నందినది.

ఎట్టి సృజన శక్తి ఇది? ఎన్ని దర్శనములు, ఎన్ని మతములు, ఎన్ని సంప్రదాయములు, ఎన్ని సాధన విధానములు, పాథోధిలోని తరంగ సంతతులవలె ఉద్భవించి తన గంభీర సమృద్ధిని వెల్లడించ గలిగెను.

భారతేతిహాసమున ప్రతిఘాతములైన ఘట్టములు సంఘటింపక పోలేదు. కాని వానికి భారతశక్తి వంగి నేల కూలెనా? లేదు. రోషముతో బరాక్రమించెనా యనునటుల, తరంగితమై ఘూర్ణిల్లి, కూలములనుగూడ దెగగోసుకొని, ప్రాంత ప్రాంతముకు, నగర నగరమునకు, పల్లె పల్లెకూ పరువులెత్తి బహుళ వ్యాప్తి నొందినది.

విభిన్నదేవతోపాసకుల మధ్య వివాదములు పెరిగి సంఘర్షణలు కలిగినప్పుడు మహోదారులైన ఋషిపుంగవులు బయల్వెడలి "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అను మహావాక్యమున విశ్వైక్యతను జాటిరి.

మరి ఒక సంఘట్టమున శ్రీ కృష్ణభగవాను డవతరించి, సకల దర్శనములను సమన్వయపరచుచు, భక్తి జ్ఞాన కర్మములకు ఏకవాక్యతను గూర్చెను.

ఇంకొక ప్రదోష కాలమున బుద్ధదేవుడు ఏతెంచి, లోక దుఃఖ నివృత్తి సాధకమైన కరుణరసము దేశదేశముల వెల్లి విరియునట్లు ప్రవహింప జేసెను.

ఇస్లాంసభ్యతాసంఘట్టనమున చైతన్య, చండీదాస్, కబీర్, నానక్, తులసీదాస్, రామదాసులవంటి భక్తవరేణ్యులు శ్రేణులు దీర్చి జాతి, మత, భాషా విచక్షణల నతిక్రమించి సార్వజనీనముగ, భక్తి రసామృతమును—మాతృభాషలలో, దేశీయగీతములలో, జీవన సరళ సంబంధములలో, పాడి, ఆడి, వెదజల్లి భారత సంస్కృతిని నవనవోన్మేషశాలినిగ నొనర్చిరి.

ఇటీవల పాశ్చాత్య నాగరకతా పదాఘాతమునకు భారతవర్షము దద్దరిల్లి, స్వధర్మ భ్రష్టమగుచుండ, చందన తరువును నరికిన కొలది పరిమళమును వెదజల్లు రీతి భారతావని యందెందరో మహానుభావులు జాగరితులై, ప్రాక్తన దివ్య విజ్ఞానమును సువ్యక్త మొనరించి ఖండ ఖండాంతరములు భారత జ్ఞాన సంపత్తికి మోకరిల్లునట్లు చేసిరి.

* * *

ఈ జ్ఞానోద్ధారకులలో ముఖ్యముగ ముప్వురు మనీషులు నవ్య భారత భాగ్యోదయమునకు త్రిమూర్తులా యనునట్లుద్భవించిరి. శ్రీ అరవింద యోగీంద్రుడు, శ్రీ కరుణచంద్ర మోహన్‌దాస్ గాంధి, శ్రీ రవీంద్రనాథ కవిచంద్రుడు.

భారత విజ్ఞాన శక్తి సత్యమును వ్యవచ్ఛేదనము గావించి అంగ ప్రత్యంగ పరిశీలనము చేయగలదు—ఒక్కుమ్మడి సమగ్ర సమన్వయ దృష్టితో అఖండ తత్వమును తిలకించగలదు.

భారతీయుని తత్వదృష్టికి రెండు చూపులు గలవు. సముద్రతీరమునందలి ఇసుకరేణువులను ఒక్కొక్కటి తీసి లెక్కపెట్ట సాహసించును— సముద్రమునంతకు ఆపోశనము పట్టి ఒకమారు "స్వాహా" అనగలదు.

భారత గణిత శాస్త్రజ్ఞులు గ్రహ గ్రహముల, నక్షత్ర నక్షత్రముల గమనముల, పరిభ్రమణముల గుణించి, శాస్త్రీకరించిరి. వారే అఖిలాండ బ్రహ్మాండకోటుల నతిక్రమించి, లెక్కలకు, కొలతలకు అందని అనంత ధామమునకు గొంపోయిరి.

భారత కళాభిజ్ఞులు ప్రకృతి పురుషులకు అనంతరూపములను గల్పించి అంగప్రత్యంగ వివరణములను హృదయరంజకముగ జిత్రించిరి. ఈ పార్థివభేదముల నతిక్రమించి సచ్చిదానందముయొక్క అఖండతత్వమునకును మూర్తి కల్పనజేసిరి. భారత దర్శకుని తీక్ష్ణదృష్టి అణువును గనుపెట్టగలదు. అవ్యక్తమైన మహత్తును తిలకించి, నిరతిశయానందమున నోలలాడగలదు.

భారత జ్ఞానసంపదయొక్క విశిష్టత ఈ త్రిమూర్తులయందును ప్రస్ఫుటముగ వ్యక్తమగుచున్నది. వీరి దృష్టి వజ్రభేదివలె లోలోతులలోకి జొచ్చుకొని పోగలదు. అన్నిటినీ మించిన అతీతమునకు ఎగురగలదు—కనుకనే వీరు పశ్చిమఖండవాసుల వైజ్ఞానిక పరిశీలనా పటిమను ప్రాచ్యదేశాల సమగ్రభావనాశక్తిని తమయందిముడ్చుకొని నూతన సమన్వయమునకు దారితీయగలుగుచున్నారు.

శ్రీ అరవిందుడు బ్రహ్మవిద్యాగరిష్ఠుడై మానవుని మర్త్యజీవనమును సహితము దివ్యజీవనముగ పరిణతి నొందించగల "పూర్ణయోగ" విధానమును ఉదాత్తస్వరమున నుద్బోధించుచున్నాడు.

గాంధీమహాత్ముడు—జాతీయ దురహంకార పరితప్తమైన పృథివిని శాంతింపజేసి, విశ్వమైత్రీభావమున నేకమొనర్చుటకు అహింసాధర్మమును అపూర్వరీతిని ఆచరించి ప్రదర్శించుచున్నాడు.

ఇక మన మధురమూర్తి రవీంద్ర కవిచంద్రుడు, ప్రపంచమును సమ్మోహపరచునటుల "విశ్వభారతీ'' గీతములను నవ్యప్రపంచమునకు అంజలిగ నివేదించి, రసజగత్తుయొక్క సౌందర్య శోభ నవఘళింప జేయుచున్నాడు.

ఈ త్రిమూర్తులు భారతవర్షమున ఏకకాలమునందు ప్రభవించి, విశ్వకల్యాణ గీతమును ముక్తకంఠములతో నాలపించుట ఈశ్వరుని నవ విధానము గాక మరియేమగును ?

భారత సభ్యత విశిష్ట లక్షణములు గలదనుట సత్యము. కాని ఇది ప్రత్యేకముగ ఏ భూభాగపు ఎల్లల మధ్యను బంధింపబడునది కాదు. ఏ జాతీయ సంప్రదాయమునందును ఇముడునది కాదు. అది సత్యమువలె నిత్యమై, విశ్వవ్యాప్తమై వెలుగొందుచు, భరతవర్షము జగద్గురు పీఠముగ నుండుటకు దగిన సంస్కార యోగ్యతను, జ్ఞానబలమును ఒసగుచున్నది. ఈ గురుపీఠస్థానమునకీ త్రిమూర్తులకంటె అధికారు లెవరు ?

శ్రీ అరవిందుడు మర్త్యుని అమర్త్యునిగ జేయగల జ్ఞానబలమును, మహాత్ముడు ఆత్మశక్తియొక్క అమోఘత్వమును, శ్రీ రవీంద్రుడు ఆత్మసౌందర్యగరిమను అపూర్వరీతిని—రణకోలాహలమునందు మునిగి యున్న ప్రపంచము సహితము చెవియొగ్గి వినునటుల ప్రబోధింపు చున్నారు.

అరవిందుని దార్శనిక గ్రంథములు ఆంగ్లమున నుండుటచే విదేశములలో నొకింత ప్రచారవ్యాప్తిగాంచిననూ, దేశమునందు ఎక్కువగా బఠింపబడుటలేదు. మహాత్ముని అహింసాతత్వము కర్మయోగసంబంధమైన దగుటచే వారి సేవాతత్పరతయే ప్రజలకు ప్రత్యక్ష ప్రబోధమగు చున్నది. అరవిందుని దివ్యోపదేశములను సులభముగా తెనిగించ

వచ్చును. మహాత్ముని కార్యప్రణాళికను బ్రకటించి వారి అహింసా మహత్తును నెరుకపరచవచ్చును.

కాని రవీంద్ర కవిచంద్రుని కవితా మాధుర్యము ననువదించు టెట్లు? రవీంద్రుని రచనలు కొన్ని ఆంగ్లీకరింపబడినవి. కాని అతని కవితలోని సారస్యము వానియందు మచ్చుకైనను గానరాదు. రవీంద్రుని గ్రంథములు కొన్ని ఇదివరలో తెనిగింపబడినవి. అ అనువాదములు, మాతృకలకు కొన్నిమైళ్ల దూరములో నున్నవి. ఈ ప్రయత్నములను గాంచిన కవిత కనువాదము దుస్సాధ్యము అనిపించును. త్యాగరాజాచార్యుని రాగమాధుర్యమును ఎవరనువదింపగలరు? "ఈథర్'' ద్రావకము నొక సీసానుండి ఇంకొక సీసాలోనికి మార్చుటెంత దుస్సాధ్యమో, 'అభిజ్ఞాన శాకుంతల'మును ఆంగ్లీకరించుటంత కష్టసాధ్యమని మానియర్ విలియమ్సు వెనుక వ్రాక్రుచ్చియున్నాడు.

* * *

గోపాలరెడ్డిగారు శాంతినికేతన పట్టభద్రులు. రవీంద్రుని ప్రియ శిష్యులు. వంగభాషాకోవిదులు. రవీంద్రుని కవితా మాధుర్యము నెటులైన సోదరాంధ్రులకు జవిచూపవలెనని ఎంతకాలమునుండియో ఆవేదన పడు చుండిరి. దాని నెంతకాలము దాచియుంచగలదా కవితాహృదయము?

నేడు—సాహసమే కానిండు—ముందుగ రెండు నాటికలను ఆంధ్రలోకమునకు బ్రసాదింప సమకట్టిరి. కాని రవీంద్రుని భాష— ఆ కాలమున సంస్కృతపదభూయిష్ఠమై యుండుటచే, ఆ భాగములను తెలుగు లిపిలో లిఖించిన, దాని మాధుర్యమును గొంతవరకు గ్రోల గల్గుదుము. రెడ్డిగారు సాధ్యమైనంతవరకు రవీంద్రుని పదముల కూర్పును, ప్రయోగముల రీతిని, శయ్యావైఖరిని నిలుప ప్రయత్నించిరి. ఇందు

మూలమున తెలుగు నుడికారమునకు గొంత కొరత వాటిల్లినను, రవీంద్రుని పలుకుబడిని మనకొకింత శ్రుతపరుపగలుగుచున్నారు.

రవీంద్రుని భాషా శైలి వానిదే కాని, అనుసృతమైనది కాదు. కవి నిరంకుశ ప్రభువు. అవ్యక్తమైన రసానుభవమును వ్యక్తపరచుటకు ప్రతిభాశాలియైన కవి తన భాషను తాను సృష్టించుకొనును. మానవుని స్వప్రయోజనముల కొరకు కల్పించుకొన్న వ్యావహారికభాష కవులకు జాలదు. మానవుని భాష అర్థముల బంధించుకొని వ్యావహారిక ప్రయోజన ములకొరకు సంకుచితమై, ఒక పరిమితిని బొందునని రవీంద్రుడే "నారద—వాల్మీకి" సంవాదమున బహురమ్యముగ వర్ణించినాడు. ప్రభాత శుభ్రభాషవలె, యామినీ శాంతివాణివలె, నక్షత్రముల నిశ్చల ధ్రువగానమువలె, దక్షిణ సమీరముల ఉచ్ఛ్వాసలవలె—తన భాషకూడ అర్థబంధముల నతిక్రమించి, ఏకస్రోతమున సంగీతతరంగముల మేళవించి, యౌవన విజయగానముల గావించవలెనని రవీంద్రుడు విశ్వవిపంచిని మ్రోయించెను.

వాల్మీకి ముఖతః ప్రతిధ్వనింపజేసిన ఈ దిగువ వాక్యములు రవీంద్రుని భాషాసంపదను చెప్పకయే చెప్పును—

"మానవుని జీర్ణవాక్యములకు నా ఛందము నవస్వరముల నొసగి, ఉద్దామ సుందరగమనము నొనగూర్చి, పక్షవంతమగు అశ్వరాజసమముగ, అర్థబంధములనుండి తప్పించి, భావస్వతంత్రలోకమున గొందొకదూరము గొంపోగలదను నాశ్వాసమున నా చిత్తము దేలుచున్నది."

* * *

రవీంద్రుని కౌమారదశలో రచించినవి రెండు—కచదేవయాని, చిత్రాంగద—నాటికలు. వసంతఋతు సమాగమమున, యౌవన విలాస

సంపద లొక్కుమ్మడి యెట్లు విజృంభించి, ఉన్మత్తత కలిగించునో, అట్టి "కైపే" ఈ నాటికలును కలిగించును.

ఆనాడు రవీంద్రుడు కేవలము రసోన్మాదుడు. మత్తేభమువలె కృతోద్యానవనముల విహరించి, కమల కాసారములలో అవిచ్ఛిన్నముగ నీదులాడుచు, హస్తరంధ్రముల నీరెక్కించి, పూరించి, వియత్పథంబున విరియజిమ్ముచూ, కోమలాట్టహాసము గావింపు నొకతూరి ;—మరి ఒకమారు, లతానికుంజముల విదలించి, కుసుమ సంతతులను రాలించి, మూగిన మధుప సంతతులను అదరించి, బెదరించి, ఆనంద రసోన్మత్తుడై అతిశయించును.

మరి ఒకమారు పర్వతసానువులపై నెగబ్రాకి, అచ్చట స్వైర విహార మొనరించు అప్సరాంగనల పూవుబెడదల సాధ్వసము రగిలించి విహ్వాలుడవును—ఇంకొకతరి తన మత్తకుంభముతో చందనతరువులపై బడి పోరాడి దిక్కు దిక్కులకు పరిమళమును విరజిమ్మి క్రీడించును.

మరి ఒకప్పుడు పర్వత శిఖరములపై శాంతిధ్యాననిమగ్నులైన తపోధనులను సమాధులనుండి అల్లన మేల్కొలిపి వారి జితేంద్రియత్వ మును బరీక్షించును.

ఇంకొకమారు పర్వతసానువులనుండి దుమికి కేరింతలాడుచు జరజర పల్లెల పూరి గుడిసెలముందు ధూళి ధూసరితములైన కోమల శరీరములతో చిందులాడుకొను పిల్లగాండ్ర నెత్తి వీపుపై నిడుకొని, గంతులువేయుచు ఏ వాత్సల్యరసజగత్తుకో మోసికొని పోవును—

అయ్యది భావోన్మాదక్రీడ, రసావేశావస్థయందలి చిద్విలాసము. భూమిని స్వర్గమును ఐక్యపరచి మానవుని దేవపీఠమున ఆసీనుని చేయగల సాధనామహిమ అది.

పవిత్ర భరతవర్షమున తత్వజ్ఞులు, యోగులు, శిల్పులు, కవులు, కళాభిజ్ఞులు ఏకశ్రేణికి చెందిన ద్రష్టలు !—స్రష్టలు. వారి ఉపకరణములు భిన్నములు కాని, లక్ష్యమునందు ఒకటే సిద్ధి—అద్వైతసిద్ధి.

రవీంద్రుని రచనామృతమును గ్రోలగల్గిన శ్రీమంతులు ఆనంద భోగులు కాకుండ నెట్లుండగలరు ? శ్రీ గోపాలరెడ్డిగారు ఈ ప్రథమ కుసుమములతోబాటు, క్రమక్రమముగ రవీంద్రుని ఇతర రచనలను కూడ ఆంధ్రలోకమునకు అందించి విశ్వభారతి పూజను వ్యాపన మొనర్చెదరు గాక !

ఆగస్టు ౧౯౪౪ }
బందరు }

ముట్నూరి కృష్ణారావు

# కచ - దేవయాని

(బెంగాలీలో "బిదాయ్ అభిశాప్")

మాతృక
౧౮౯౩

తర్జుమా
జూలై ౧౯౪౩

English
KACHA and DEVYANI
in
THE FUGITIVE

# కచ - దేవయాని

[దేవతలచే నియతుడై, బృహస్పతి పుత్రుడు కచుడు దైత్యగురువు శుక్రాచార్యులయొద్ద సంజీవనీ విద్యను గడించు నిమిత్తము, వారికడకు వెళ్లును. అచ్చో, సహస్రవత్సరములు గడిపి, నృత్యగీతావాద్యములద్వారా శుక్రదుహిత దేవయాని మనస్సును రంజింప జేయుచు, తాను వచ్చిన కార్యమును పూర్తిచేసికొని, కచుడు దేవలోకమునకు తిరిగిపోవును. దేవయానినుండి వీడ్కోలు గైకొను సమయమున కచుడు - దేవయాని]

### కచుడు

ఆజ్ఞనొసగుము, దేవయానీ, దేవలోకమునకు దాసుడు పయనమైనాడు. నా గురుగృహవాసము నేటితో సమాప్తము. చిరకాలముగ నేను నేర్చినవిద్య, మేరు శిఖర శిరమున అక్షయ కిరణములతో ప్రకాశించు సూర్యుని మాడ్కి ఉజ్వలరత్నమై, హృదయమును జాజ్వల్యా వంతముగ చేయునటుల ఆశీర్వదింపుము.

### దేవయాని

మనోరథము సిద్ధించినది. ఆచార్యులవద్ద దుర్లభ విద్యను సంపాదించితివి. నీ సహస్రవత్సర దుస్సాధ్యసాధన పూర్తియామెను. మనమున నీవు అభిలషించునది మరెద్దియు లేదా? ఆలోచించి చూడుము.

కచుడు

మరేద్దియు లేదు.

దేవయాని

ఏమియు లేదా? అయినను మరొకతూరి హృదయ సీమాంతము వరకు చొచ్చి, వెదకి తేరిపారచూడుము. కుశాంకురసమముగ అల్పమై, దృష్టికి అగోచరమైనను, తీక్ష్ణతమమైన ఏదేని వాంఛ నీ అంతర ప్రాంతమున దాగియున్న దేమో చూడుము.

కచుడు

నేడు కృతార్థతాభరితమైయున్నది నా జీవితము. సులక్షణా, నాలో ఎచ్చటను ఎట్టి దైన్యమును, శూన్యమును లేవు.

దేవయాని

అటులైన ముల్లోకములలో నీవు సుఖివి. ఉచ్చ శిరమున గౌరవము వహించి, నిజకర్తవ్య పులకిత మనమున ఇంద్రలోకమునకు చనుము.

స్వర్గపురమున ఆనందస్వాగత ధ్వానములు చెలరేగ గలవు.

మనోహరస్వరమున మంగళశంఖము మ్రోగగలదు. అప్పుడే వికసించిన నందన మందార మంజరులచే

సురాంగనాగణములు నీ శిరమున పుష్పవర్షముల కురిపింప గలరు.

స్వర్గపథమున కలకంఠమున అప్సరసలు, కిన్నర నారీమణులు గీతముల నాలపించుచు మంగళ హారతుల నొసగగలరు....అయ్యో, విప్రకుమారా, విదేశమున, విజనమున సుకఠినమగు అధ్యయనమున నీ దినముల బహు క్లేశముతో గడిపితివి!

సుఖమయమగు గృహమును స్మరణకు తెచ్చుటకును, ప్రవాసవేదనను నివారించుటకును ఇచ్చట ఎవరును లేకపోయిరి.

దరిద్రకుటీరమున నున్న వెల్ల నొసగి, యథాసాధ్యముగ అతిథిని పూజించితిని. కాని స్వర్గసుఖము నెటుల పొందగలవు? సురలలనల అనిందిత ముఖములు ఏవి ఇచ్చోట?

సుఖస్వర్గమునకు తిరిగి చనినపిదప, ఆతిథ్య అపరాధములు నీ స్మరణయందు ఉండకుండును గాక యని మనమున మిక్కిలి ఆశించుచున్నాను.

కచుడు

సుకళ్యాణమైన హాసముతో ప్రసన్నమగు వీడ్కోలు నియ్యవలె సుమా ఈ దాసునకు.

దేవయాని

హాసమా! అయ్యో సఖుడా, ఇది స్వర్గపురి కాదు.

పువ్వును పురుగువలె, ఇచ్చట కోరిక చిత్తమును తొలచుచుండును.

నిరాశచే అవమానిత భ్రమరము ముకుళిత పద్మమును చుట్టి మాటిమాటికి తిరుగుచుండురీతి, వాంఛ వాంఛిత విషయమునకై తహతహలాడుచుండును.

ఇచ్చటనుండి సుఖము వెడలిపోయిన పిదప, స్మృతి ఏకాకిగ కూర్చొని, శూన్యగృహమున దీర్ఘ శ్వాసముల విడుచుచుండును.

ఇచ్చో హాసములు అంత సులభములు కావు.

మిత్రమా, పొమ్ము, వృథా కాలయాపనచే ఏమి లాభము! దేవతలు నీ ఆగమనమునకై ఎదురుచూచుచు కంఠముల చాచియున్నారు.

—వెడలిచనుచున్నావా? రెండు మాటలతోనే సకలము సమాప్తమాయెనా?

దశ శతవర్షముల పిదప, ఇదేనా వీడ్కోలు?

కచుడు

దేవయానీ, నా అపరాధ మెద్ది?

దేవయాని

అయ్యో, ఈ అరణ్యభూమి సహస్ర వత్సరములుగ శీతల మనోహరచ్ఛాయల నొసగినది. పల్లవ మర్మరధ్వానులచే పులకిత మొనర్చినది. విహంగ కలకలారవములచే చిత్తమును హరించినది.

దీనిని నేడు ఇంత సునాయాసముగ వదలి వెళ్లు చున్నావుగదూ!

తరురాజి మ్లానమైనటుల కాన్పించుచున్నది.

అదో చూడుము, నేటి వనచ్ఛాయలు శోక స్నిగ్ధ ములై, మరింత నల్లదనమును దాల్చినవి. వాయువులు క్రందనధ్వానుల చేయుచున్నవి. శుష్కపత్రములు దుఃఖ బాష్పములవలె రాలి పడిపోవుచున్నవి.

నీవుమాత్రము, నిశాంత సుఖస్వప్నమురీతి, అధర పల్లవములమధ్య సిత మందస్మిత సుమములు వికసించుచుండ, ఆనందమున వెడలుచున్నావు.

కచుడు

దేవయానీ, ఈ వనభూమిని నేను మాతృభూమిగ గణించుచున్నాను. ఇచ్చట నాకు పునర్జన్మ కలిగినది. దీని యెడల నాకు ఎట్టి అనాదరమును లేదు. చిరప్రేమభరితు డనై శాశ్వతముగ దీనిని స్మరించుచుండెదను.

## దేవయాని

ఇదో వటవృక్షము, అనుదినము ఆవులమందల మేపుచువచ్చి, మధ్యాహ్నపు వేడిఎండవేళల దీనిక్రింద పరుండి నిద్రించెడివాడవు.

అతిథివాత్సల్యభావమున, ఈ తరువు బడలిన నీ శరీరముపై దీర్ఘచ్ఛాయల పరచి, నీకు సుఖనిద్ర కలుగ చేసెడిది. తళతళ మెరయు పల్లవదళములచే మృదుస్వరమున వీచెడిది.

సఖుడా, పోయి కొంతసేపు ఈ పరిచిత తరుతలమున కడసారి కూర్చుండి, ఈ స్నేహచ్ఛాయల జిలిబిలి పలుకుల విని పొమ్ము.

రెండు క్షణములు ఉండి వెడలుము. ఆ విలంబనచే నీ స్వర్గమునకు ఎట్టి నష్టమును చేకూరదు.

## కచుడు

ఈ చిరపరిచిత స్నేహితగణములు నా నిర్గమనకాలమున అభినవములా యనునట్లు తోచుచున్నవి.

విడచి వెడలిపోవు ప్రియమిత్రుని బంధించుటకై అన్నియు వ్యగ్రస్నేహమయములై, అధికములగు నూతన బంధనజాలముల పన్నుచున్నట్లున్నవి.

అంతిమ ప్రార్థనల కావించుచున్నవి. అపూర్వ సౌందర్యరాశిని కన్బరచుచున్నవి.

వృక్షరాజమా, ఆశ్రితజనమిత్రమా! ఇదే నమస్కరించుచున్నాను. ఎందరో పాంథులు నీ నీడలయందు కూర్చొన గలరు!

ఎందరో విద్యార్థులు, ఎన్నో దినములు దట్టముగ అలముకొన్న నీ పచ్చని శాఖావితానముక్రింద, నిర్జనమున నిశ్శబ్దముగ తృణాసనమున కూర్చుండి, పతంగ మృదు గుంజన స్వరముల ఆలకించుచు, నావలెనే అధ్యయనము చేయగలరు!

ప్రాతఃస్నాన మాచరించి, ఋషిబాలకులు తడిబట్టల నీ శాఖలపై ఎండవేసికొందురు! గోపబాలకులు మధ్యాహ్న వేళల ఆడుకొందురు.

ఒహో! వారందరిమధ్య ఈ నీ చిరకాల మిత్రుడును నీ స్మరణయందు విరాజిల్లుచుండుగాక.

దేవయాని

మన హోమధేనువును మనస్సునం దుంచుకొనుము. స్వర్గసుధను పానముచేసి, గర్వమున ఈ పునీత గోమాతను మరువకుము.

## కచుడు

సుధకన్న సుధామయములు దీని క్షీరములు. మాతృరూపిణి శాంతిస్వరూపిణి శుభ్రకాంతిపయస్వినియగు దీని దర్శించిననే పాపక్షయ మగును.

ఆకలి దప్పుల అలసటల సరకుగొనక దీనిని సేవించితిని.

గహన కాననముల, శాద్వలములగు స్రోతస్వినీ తీరముల, దీర్ఘదినములు దీనిని వెంబడించి నేనును తిరుగుచుంటిని! చూపుమేరవరకు స్నిగ్ధకోమల తృణరాశి పరచియుండ నిమ్నతటముల తనకు యిష్టమువచ్చినటుల తుష్టిగ మేసి, అలసత్వమున స్థూలశరీరముతో ఒక తరుతలమును మెల్లగచేరి, పచ్చిక పరుపుపై పవళించి, చాలసేపువరకు నెమ్మదిగ నెమరువేయుచుండెడిది.

మధ్యమధ్య కృతజ్ఞతాసూచకములైన శాంత దృష్టులు గాఢస్నేహపూరితములైన నేత్రములనుండి ప్రసరించుచుండ, నా దేహమును లేహన మొనర్చెడిది.

ఆ స్నిగ్ధ అచంచలదృష్టి, ఆ పరిపుష్ఠ శుభ్రతనువు, ఆ నిగనిగలాడు వాలము సదా జ్ఞప్తియందుండగలవు.

దేవయాని

ఇంకను జ్ఞప్తియుంచుకో మన కలస్వని స్రోతస్విని వేణుమతిని.

కచుడు

దానిని మరువజాలను. వేణుమతీ, ఎన్ని కుసుమిత కుంజముల దాటి, మధుకంఠమున ఆనందిత కలగానమును గైకొని, జనపద వధువువలె వడివడి అడుగులతో నడచుచు వచ్చి, ఎన్నియో శుశ్రూషల కావించుచున్నావు!

నిత్యము శుభముల నొసగుటయే వ్రతముగా కలదియై, నా ప్రవాస సమయమున నాకు ప్రాణస్నేహితురాలైనది.

దేవయాని

అయ్యో, చెలికాడా, ఈ ప్రవాస సమయమున, నీ పరగృహవాస దుఃఖమును మరపించుటకై రాత్రింబవలు మనమున యత్నించుచుండిన, ఇంకెవతయైన సహచరి నీ పార్శ్వమున నుండెనా ?

—హా, నా ప్రారబ్ధమా!

కచుడు

చిరజీవితముతో ఆపె నామము అల్లుకొని యున్నది.

దేవయాని

మనస్సున ఉన్నదా తొలుత నీవు ఇచ్చటికి వచ్చిన దినము!

తరుణ అరుణుని విధమున కిశోర బ్రాహ్మణుడవు. గౌరవర్ణ తనువుపై నిగనిగలాడు కాంతి మెరయుచుండ, చందన చర్చిత ఫాలతలముతో, కంఠమున పుష్పమాలను వహించి, చీనాంబరములను ధరించి, అధర నయనముల ప్రసన్న సరళహాసములు ఒలుకుచుండ, అచ్చో పుష్పవనమున వచ్చి నిలువబడితివి.

కచుడు

నీవు అప్పుడే స్నానమాచరించి, దీర్ఘ ఆర్ద్ర కేశజాలములతో, జ్యోతిస్నాతయగు ఉషోమూర్తివోలె నవశుక్లాంబరము ధరించి, పూలబుట్టను కైనిడి, పూజకొరకు ఒంటరిగ పువ్వులు కోయుచుంటివి.

'ఈ శ్రమ నీకుతగదు, అనుమతి ఇమ్ము, దేవీ, పుష్పముల నేను కోసితెచ్చెదను' అని వందనమొనర్చి పలికితిని.

దేవయాని

నేను సవిస్మయముగ, అప్పుడే నీ పరిచయమును అడిగితిని. 'మీ తండ్రివద్ద శిష్యుడనగుటకు మీ ద్వారమునకు

వచ్చియున్నాను, నేను బృహస్పతి పుత్రుడను' అని వినయ ముగ చెప్పితివి.

కచుడు

దానవ గురువు స్వర్గబ్రాహ్మణుని తిరిగి పంపివేయు నేమోయని డెందమున సందేహ మొదవెను.

దేవయాని

నేను తండ్రియొద్దకువెళ్లి 'పితృదేవా, మీ చరణ ములకడ భిక్ష యొకటి కలదు' అని నవ్వుచు నుడివితిని.

ప్రీతితో ప్రక్కన కూర్చుండబెట్టుకొని, చేతులతో నా తలను నివురుచు 'నీకు ఇయ్యరానిది ఎద్దియు లేదు, బిడ్డా' అని శాంత మృదువచనములతో అనెను.

'బృహస్పతి పుత్రుడు మీ సన్నిధికి వచ్చియున్నాడు, అతనిని మీ శిష్యునిగ అనుగ్రహింపుడు. ఇదే నా ప్రార్థన' అని అంటిని.

—ఇదంతయు జరిగి నేటికి ఎంత కాలమాయెను! అయినను నిన్న మొన్న విషయమువలె నున్నదిగదా!

కచుడు

దైత్యులు ఈర్ష్యాభరితులై మూడుపర్యాయములు నన్ను వధచేసిరి. దేవీ, నీవు కనికరించి, నా ప్రాణములు తిరిగి వచ్చునటుల చేసితివి—ఈ విషయము నా హృదయ మున చిరకృతజ్ఞతను మేల్కొలుపుచుండును.

# దేవయాని

కృతజ్ఞత! కృతజ్ఞతను మరచిపొమ్ము, ఎట్టిదుఃఖమును లేదు. నేనుచేసిన ఉపకారము బూడిదయై పోనిమ్ము. దానములకు ప్రతిదానముల నేను కోరుటలేదు.

పోనీ, సుఖస్మృతి మనమున ఈషణ్మాత్రమైన లేదా? ఆనంద సంగీతము నీ హృదయమునను వెలుపలను ఏనాడైన మ్రోగియుండిన, ఏ సంధ్యాకాలముననైన, అధ్యయన సమయమున వేణుమతీ తీరమున పుష్పవనమున కూర్చొనియుండ, అపూర్వ పులకరాశి నీ మనమున పొంగి అతిశయిల్లియుండిన, ప్రసూన పరిమళములభంగి నీ హృదయపు నిట్టూర్పులు సంధ్యా గగనమును పూచిన పొదరిండ్లను క్రమ్మి ఆక్రమించియుండిన, ఆ సుఖమునకు హేతువైన సంగతిని మనస్సునందుంచుకొనుము. కృతజ్ఞతను దూరముగ త్రోసివేయుము.

మిత్రమా, ఇచ్చట ఎవరైన పాడినపుడు నీ చిత్తమునకు సుఖము కలిగియుండిన, ఎన్నడైన ఇట్టి వస్త్రమును ఎవ్వరేని కట్టుకొని కాన్పించిన, నీ ప్రశంసావాక్యములు అప్రయత్నముగనే బయలువెడలి, హృదయము ప్రసన్నమగుచుండ నేత్రములు సంతృప్తిభరితములై అర్ధనిమీలితము లగుచుండ, 'ఈమె నేడు ఎంత సుందరముగా

ఉన్నది' అని మనమున తలపోసియుండిన, ఆ విషయముల నీ విరామవేళల సుఖస్వర్గధామమున జ్ఞప్తియుంచుకొనుము.

ఎన్నిపర్యాయములు, ఈ వనమున దిగ్దిగంతముల యందు, శ్యామ స్నిగ్ధ వర్ష నవమేఘరాసులు ఆషాఢ నీల జటలవలె మూగి క్రమ్మియుండ, అవిరళ వృష్టిజలధారలచే కర్మశూన్యమైన దినమున, గాఢకల్పనాభారముచే హృదయ ములు పీడింపబడెడివి.

ఇంకను ఎన్నిపర్యాయములు, అకస్మాత్తుగ వసంత మున బాధాబంధనహీనమును, ఉల్లాసతరంగములచే ఆకులమును యగు యౌవనోత్సాహము పొంగుచువచ్చి, కాకలీరవములచే ధ్వనితమగు ఆ ఆవేగప్రవాహము లతల యందు పర్ణములయందు పుష్పములయందు వనవనాంతర ములయందు వ్యాపించి, ప్రతి చిరుకెరటమునందును ఆనంద నృత్యమును లేవనెత్తెడిది.

ఎన్నెన్ని ఉషఃకాలములు, ఎన్ని పూర్ణిమలు, పుష్ప పరిమళములచే సాంద్రతరములైన అమావాస్యాంధకారములు ఈ వనమున నీ జీవిత సుఖదుఃఖములతో మిశ్రితములై చనినవో ఒకమారు తలపునకు తెచ్చుకొనుము.

వానిమధ్య చిరచిత్రరేఖలచే మనస్సున చిత్రించి, రంజింపగల ఏదేని ఒక్క ప్రాతఃకాలము, ఒక్క సంధ్య

వేళ, ఒక్క ఆనందరాత్రి, ఒక్క హృదయస్పందనము, ఒక సుఖము, ఒక ముఖము నీకు కాన్పించుటలేదా? కేవలము ఉపకారమేనా! శోభ కాదా, ప్రేమ కాదా, మరేమియు కాదా!

కచుడు

చెలీ, ఇకనున్నది వెలుపల ప్రదర్శింప వలనుపడనిది. అంతరమున రహస్యముగ రక్తముతో ప్రవహించుచున్న దానిని ఎట్లు బయట చూపగలను?

దేవయాని

మిత్రమా, తెలియును. కనురెప్పపాటున, ఎన్ని పర్యాయములు నీ హృదయము నా హృదయకాంతిచే చకితమైపోవుట నేను చూడలేదు! అందుచేతనే నేడు ఈ రమణికి యింతటి సాహసము.

—అటులైన ఉండిపొమ్ము. ఉండిపొమ్ము. ఇచ్చట నుండి వెడలకుము. యశోగౌరవముచే సుఖములేదు. ఇచ్చటనే వేణుమతీ తీరమున మనమిద్దరము అభినవ స్వర్గలోకమును సృజించెదము.

ఈ నిర్జనవనచ్ఛాయలతో, ఏకాంతము నభిలషించు పరస్పరశ్రద్ధలచే పెంపొందు, ఆవేశమున పరవశమును

చెందు హృదయ యుగళమును లీనముచేసి, ఇతరము లన్నియు విస్మరించెదము. చెలికాడా, నీగుట్టు నాకు ఎరుకయే సుమా.

కచుడు

కాదు, కాదు, దేవయానీ!

దేవయాని

నాకు తెలియదా నీ కల్లయగు కపటనాటకము? నీ హృదయమును నేను కాంచలేదా? ప్రేమ హృదయ మర్మముల అవగాహనము చేసికొనగలదని నీకు తెలియదా? వికసితపుష్పము పల్లవములమధ్య కప్పబడినను, దాని సౌరభ మును ఎచ్చట దాచగలవు?

ఎన్నిసారులు నీవు ముఖమును ఎత్తగనే, దృష్టిని సారించి చూడగనే, నా కంఠధ్వనిని నీవు వినగనే, చలిత వజ్రము తన జిగిబిగి కాంతులచే మెరయుచందమున, నీ హృదయము సర్వాంగములయందును కంపించిపోయెడిది! అదంతయు నేను చూడలేదా?

మిత్రమా, నీవు పట్టుబడినాడవు, అందుచే నీవు నా ఖైదీవి. నా పట్టును నీవు వదలించుకొనజాలవు.

ఆ ఇంద్రుడు ఇక నీ ఇంద్రుడు కాదు సుమా.

కచుడు

శుభ్రస్మితముఖీ! సహస్ర వత్సరములుగ, ఈ రాక్షస పురమున కావించిన సాధనయంతయు ఇందుకొరకా?

దేవయాని

ఏల కాకూడదు? ఈ జగత్తున విద్యకొరకేనా జనులు దుఃఖముల సహించుట? రమణికై మహాతపముల నెవరును కావించియుండలేదా? సంవరుణుడు తపతిని సతిగా పొంద కోరి, ప్రఖర సూర్యునివైపు చూచుచు, అనాహారమున, కఠోరసాధనలెన్నియో కావించియుండలేదా?

అయ్యో, విద్యమాత్రమేనా దుర్లభము. ప్రేమ ఇచ్చో అంత సులభమా? సహస్రవత్సరములుగ ఏ ధనముకొరకు నీవు సాధన యొనర్చితివో, అది నీకే తెలియదు.

విద్య ఒకవైపున, నేను మరొకవైపున వేచియుండ కొన్నిసమయముల నన్ను, మరికొన్నివేళల దానిని ఉత్సుక ముతో అభిలషించితివి. నీ అనిశ్చిత చిత్తము రెండింటిని అత్యంత యత్నమున, రహస్యముగ ఆరాధించుచుండినది. నేడు మేమిద్దరము ఒకే దినమున నీచే వరింపబడుటకై ఎదుట నిలిచియున్నాము.

—మిత్రమా, నీకు ఇష్టమున్నదానిని వరింపుము. సరళసాహసమున 'విద్యయందు సుఖములేదు, యశస్సుచే సుఖము కలుగదు, దేవయానీ, నీవే నా ఆకాంక్షల పరమావధివి, మూర్తీభవించిన సిద్ధివి, నిన్నే నేను వరించితిని' అని నీవు చెప్పిన తప్పిదములేదు నష్టమురాదు లజ్జయు పడరాదు.

ప్రాణసఖా, రమణీమనము సహస్రవర్షముల సాధనాధనమని తెలిసికొనుము.

కచుడు

శుభాంగీ, మహాసంజీవినీ విద్యను సంపాదించి, దేవలోకమునకు తిరిగి వచ్చెదనని దేవసన్నిధానమున శపథమొనర్చితిని. అందులకనియే నేను ఇచ్చటికి వచ్చితిని. ఆ శపథము నా హృదయమున సదా మేల్కొని, నన్ను హెచ్చరించుచుండును. ఆ ప్రతిజ్ఞ పూర్ణమాయెను. నా జీవితము ఇంతకాలమునకు చరితార్థమాయెను. నేడు నేను దేనిని స్వార్థమునకై కోరుటలేదు.

దేవయాని

ఛీ, మిథ్యాభాషి, విద్యనుమాత్రమే కోరియుంటివా? గురుగృహమునకువచ్చి, కేవలము విద్యార్థిరూపమున, ఏకాంతమున శాస్త్రగ్రంథములపై కన్నుల నిగుడ్చి, రాత్రిం

బవలు అధ్యయననిమగ్నుడవై యుంటివా? ఇతరముల అన్నిటియెడ నీవు ఉదాసీనుడవా?

అధ్యయనశాలను వదలి, వనవనాంతరముల భ్రమ్మరి పుష్పముల ఏరితెచ్చి మాలగా అల్లి, వికసితస్మితవదనముతో ఈ విద్యాహీనకు ఏల బహూకరణమొనర్చెడివాడవు? ఇది యేనా నీ కఠోరవ్రతము! ఈ నీ వ్యవహారము విద్యార్థికి ఉచితమైనదేనా?

ప్రభాతమున నీవు అధ్యయనము చేయుచుండ, శూన్యమగు పూలబుట్టను చేబూని నవ్వుచువచ్చి నిలువబడెడి దానను; గ్రంథముల ఆవలత్రోసి, లేచివచ్చి శిశిరసిక్త ప్రఫుల్లకుసుమరాశిచే నన్ను ఏల పూజించెడివాడవు?

అపరాహ్ణవేళ, తరువులకు నీరుపోయు తరి, నేను బడలియుండుటను కాంచి, ఏల అనుగ్రహించి, జలముల తోడి తెచ్చి ఇచ్చెడివాడవు?

పాఠముల పరిత్యజించి, ఏల నా హరిణ శాబకమును పాలనమొనర్చెడివాడవు?

ప్రేమభరిత నయనములపై, స్నిగ్ధచ్ఛాయామయము లగు దీర్ఘపక్ష్మములు వ్రాలువిధమున, సంధ్యావేళల నదీ

తీరములపై, అంధకారరాసులు నిశ్శబ్దముగ ఆవరించు సమయముల, స్వర్గమునుండి నేర్చుకొనివచ్చిన శ్రావ్యసంగీతమును ఏల వినిపించెడివాడవు?

విద్యను సేకరించుటకై వచ్చి నా హృదయమును స్వర్గచాతురీజాలమున ఏల హరించితివి? ఇప్పుడు తెలిసినది, నన్ను వశపరచుకొని తండ్రిగారి హృదయమును ప్రవేశింప గోరితివి.

రాజదర్శనముచేసి, మనోరథమునుపొంది, ద్వారపాలకుని హస్తమున తన మనస్సంతోషమున ఒకటి రెండు దీనారములు ఇచ్చిపోవువాని చందమున, నీవు కృతకార్యుడవై, నేడు నాకు కొంత కృతజ్ఞతను చూపి వెడలిపోవుచున్నావు.

కచుడు

సూక్ష్మజ్ఞానమున ఇట్టి విపరీత వ్యాఖ్యలా! ఓ అసహనశీలనారీ, సత్యమును వినుటచే ఏమిసుఖము? ధర్మమునకే ఎరుక, నే నెన్నడును మోసగించి యుండలేదు. అకపట ప్రాణమున ఆనందహృదయముతో నీకు సంతోషము కలుగచేయుచు సేవచేసియుండుటచే అపరాధము చేసియుంటినేని, దానికి విధియే శాస్తి నొసగుచున్నాడు. అది మనస్సుననే దాగి ఉండకలదు, దాని విషయమై నేనేమియు చెప్పను.

మూడు లోకములలో ఎవరికిని ఉపయోగపడని, కేవలము నా స్వాంతవిషయమేమైన దానిని వినుటచే ఏమి లాభము? ప్రేమించితినో లేదో, ఆ తర్కము నే డేల? నా ముందున్న కార్యమును నేను సాధించెదను.

స్వర్గము ఇక స్వర్గముగా నాకు తోచకపోయినను, పొడువబడిన జింకపోలిక, దూరవనతలమున చిత్తముపొర్లి పొర్లి, కొట్టుకొని కొట్టుకొని చావనున్నను, సర్వకార్యముల యందును నా దగ్ధప్రాణమున చిరతృష్ణ రేగి ప్రబలియుండినను, సుఖశూన్యమగు స్వర్గధామమునకు వెడలియే తీరవలసి యున్నది.

దేవతలకందరికిని సంజీవనీ విద్యను నేర్పి, నూతన అమరత్వమును నేను స్థాపింపగలిగినపుడే, నా జీవితము సార్థకము. దానిపూర్వము నా సుఖములను నేను కోరను. క్షమింపుము నన్ను, దేవయానీ, నా అపరాధములను క్షమింపుము.

దేవయాని

నా మనమున క్షమగూడ మిగిలియున్నదా! కర్కశుడా, ఈ నారీచిత్తపల్లవమును కులిశ కఠోరము ఒనర్చితివిగదా! సర్వదుఃఖశోకముల దూరముగ త్రోసి, సగౌరవముగ నిజ కర్తవ్యపులకమున నీవు స్వర్గలోకమునకు చనియెదవు.

నాకు ఏమి పని ఉన్నది? నా వ్రతము ఎద్ది? చితికి పోయిన నా నిష్ఫల జీవితమున ఏమి మిగులును? దేని గౌరవము?

ఈ వనమున స్నేహితులెవరులేక, లక్ష్యహీననై, అవనతశిరమున, ఒంటరిగ చతికిలబడి కూర్చొనియుందును. ఏ వైపునకు నేను కన్నుల త్రిప్పి చూచినను, వేలకొలది స్మృతికంటకములు చురుకుగ గ్రుచ్చుకొనుచుండును. అతి క్రూరమగు లజ్జను నా వక్షమున దాచికొనుటచే అది మాటి మాటికి నా హృదయమును కరచుచుండును.

ఛీ, ఛీ, ఎచ్చటనుండి ఏతెంచితివి మమతలేని పథికుడా! నీ కాలమును వెళ్లబుచ్చుకొను నెపమున, నా జీవితచ్ఛాయలందు, కొంతసేపు కూర్చొని, పువ్వులనువలె నా బ్రతుకు సుఖములను కోసి తీసికొని, ఒక సన్నని దార ముతో మాలనల్లితివి.

వెడలిపోవు సమయమున ఆ మాలను మెడలో వేసి కొనక, అవహేళనమున ఆ సన్నని దారమును ముక్కలు ముక్కలుగ త్రెంచి పారవైచితివి. ఈ జీవితమహిమా సమస్తమును దుమ్ములో జీరాడునటుల చేసితివి.

ఇదో, నీపై నా శాపము; ఏ విద్యకొరకు నన్ను నిర్లక్ష్యమొనర్చితివో, ఆ విద్య నీకు సంపూర్ణముగ వశము

కానేరదు. నీవు దాని భారమును మాత్రము మోయు చుందువు; దానిని నీవు ఎన్నడును అనుభవింపజాలవు. నేర్పింపగలవు, కాని ప్రయోగింప వలనుపడదు.

కచుడు

దేవీ, నేను వరము నొసగుచున్నాను. సర్వాగ్లానుల విపులగౌరవమున మరచి, సుఖముగ నుందువుగాత!



# చిత్రాంగద

మాతృక

సెప్టెంబరు ౧౮౯౧

తర్జుమా

జూలై ౧౯౪౩

English
"CHITRA"

# చిత్రాంగద



ఇతర భారతీయ భాషలలోకే కాక, ఈ క్రింది యిరోపీయ భాషలలోనికి అనువదింపబడెను.

ఇంగ్లీషు (౧౯౧౩)
జర్మన్ (౧౯౧౪)
పోర్చుగీస్ (౧౯౧౪)
ఇటాలియన్ (౧౯౧౬)
స్పానిష్ (౧౯౧౯)
రష్యన్ (౧౯౨౪)
లట్వియన్
హంగేరియన్
హిబ్రూ

# సూచన

## శ్రీ రవీంద్రనాథ ఠాకూరు

అనేక వత్సరములకృతము రైలులో శాంతినికేతనమునుండి కలకత్తాకు వెళ్లుచుంటిని. అప్పుడు చైత్రమాసమని తలచెద. రైలులైనుకు ప్రక్కప్రక్క పిచ్చిచెట్ల అడవిలో ఊదా పచ్చని తెల్లనిరంగుల పువ్వులు విరివిగ పూచియుండెను. చూడగా చూడగా, కొంతకాలమునకు తర్వాత ఎండలు ముదిరి, పువ్వులు తమరంగుల ఎండమావులతో మాయమైపోగల వను తలంపు మనస్సునకు వచ్చెను. అప్పుడు గ్రామముచుట్టు, మామిడి చెట్ల కొమ్మకొమ్మకు పిందెలు పుట్టును. తరుప్రకృతి తన అంతర నిగూఢ రసముయొక్క స్థిరపరిచయమును ఫలసంపత్తియందు ఇయ్యగలదు. దానితో కూడ ఎందులకో తెలియదు, హఠాత్తుగ సుందరయువతి తన యౌవన మాయతో తన ప్రేమికుని హృదయమును మరపించునటుల అభిప్రాయ పడిన, సౌభాగ్యపు ముఖ్యాంశమున భాగమిచ్చు తరుణమున తన సురూప మునే తన సవతియని నిందించవచ్చును అనెడి తలంపు వచ్చెను.

ఇది ఆమె బయటివిషయము. క్షణికమోహ విస్తరణద్వారా జీవిత ఉద్దేశ్యమును సిద్ధిపొందుటకు ఋతురాజు వసంతునికడ పొందిన వరము. దాని అంతరమున చారిత్రశక్తియే యుండిన, మోహముక్తమగు శక్తియొక్క దానమే, ఆమె ప్రేమికుని పక్షమున మహత్తరలాభము, జీవితయుగళ జయయాత్రయందు సహాయమును అగును. ఆ దానమే ఆత్మయొక్క నిశ్చల పరిచయము; దీని పరిణామమున క్లాంతిలేదు, సమాప్తిలేదు. అభ్యాస

ధూళీ ప్రలేపముననూ, దాని ఉజ్వలతకు మాలిన్యములేదు. ఈ చారిత్రకశక్తి జీవనపు యదార్థ సంపత్తి. నిర్మమ ప్రకృతియొక్క సద్యో ప్రయోజనములయెడ అది ఆధారపడియుండదు. అనగా దీని మూల్యము మానవికము, ప్రాకృతికము కాదు.

ఈ భావమును నాట్యరూపమున ప్రకాశింప అభిలాష అప్పుడే కలిగెను. దానితో కూడనే మహాభారత చిత్రాంగద కథ మనస్సునకు వచ్చెను. ఈ కథ రూపాంతరమున నా మనస్సుతో కూడి అనేక దినములు ప్రచ్ఛన్నముగ నుండినది. కడపటికి వ్రాయు ఆనంద అవకాశము ఒరిస్సాలో పాండుయావనమున ఒక ఏకాంత పల్లెయందు దొరకినది.



# భూమిక

ప్రభాతపు ప్రథమ కాంతి అరుణ వర్ణదీప్తులచే ఆవృతము.
అర్థసుప్త చక్షువులపై దాని తొలి ప్రేరణ తగులును.
తుదకు, రక్తిమ ఆవరణను భేధించి, తన నిరంజన శుభ్రతయందు
అది సముజ్వలమై జగత్తున జాగృతమగును.

* * *

అటులనే, సత్యపు ప్రథమ ఉపక్రమణ అలంకారముల పైతళుకులలో
వర్ణవైచిత్రములలో;
దాని ఆకర్షణ అసంస్కృతచిత్తమును విహ్వల మొనర్చును
ఎప్పుడో ఒకప్పుడు, ఆ బహిరాచ్ఛాదనలనుండి ఉన్ముక్తమైనపుడే
దాని పూర్ణవికాసము మనస్సువద్ద ప్రబుద్ధమగును.

* * *

ఈ తత్వమే చిత్రాంగద నాటకపు మర్మవిషయము
ఈ నాట్యగాథయందు కలదు.

ప్రథమమున, ప్రేమబంధనములు మోహావేశమున.
పిదప, దాని ముక్తి ఆ భ్రాంతినుండి
సహజసత్య నిరలంకృత మహిమయందు.

శ్రీ రవీంద్రనాథ ఠాకూరు
(నృత్య నాట్య చిత్రాంగద భూమికారూపమున)

# చిత్రాంగద

అనంగ ఆశ్రమము.

చిత్రాంగద, మదనుడు, వసంతుడు.

చిత్రాంగద

నీవేనా పంచశరుడవు?

మదనుడు

సమస్త నరనారీ హృదయముల వేదనాబంధనములచే ఆకర్షించి తెచ్చు మనసిజుడను నేనే.

చిత్రాంగద

ఏ వేదనయో, ఏ బంధనమో దాసికి తెలియును. నీ పదముల కడ ప్రణమిల్లుచున్నాను.

ప్రభూ, నీవు ఏ దేవుడవు?

వసంతుడు

నేను ఋతురాజును. జర, మృత్యు వను దైత్య ద్వయము నిమిష నిమిషమునకు విశ్వకంకాళమును బహిర్గత మొనర్ప యత్నించుచుండును. నేను వారి వెనుక వెనుక

వెంటాడి, అడుగడుగునను వారిని ఓడించుచుందును. రాత్రింబవలు అదే సంగ్రామము.

నేను అఖిలజనుల అనంత యౌవనమును.

చిత్రాంగద

భగవాన్, నీకు ప్రణామములు. దేవదర్శనముచే దాసి చరితార్థయాయెను.

మదనుడు

కల్యాణీ, ఎందులకై ఈ నీ కఠోర వ్రతము ? తపోవ్రత తాపమున యౌవనకుసుమమును శుష్కింపజేసి మలిన మొనర్చుచున్నావు! అనంగపూజకు కాదు ఈ విధానము.

నీవు ఎవ్వతెవు? భద్రాంగీ, నీ కోరిక ఎద్ది?

చిత్రాంగద

అనుగ్రహించిన నా వృత్తాంతమును వినిపించెదను. ప్రార్థనను తదుపరి తెలియపరచెదను.

మదనుడు

వినుటకై ఆతురపడుచున్నాము.

చిత్రాంగద

నేను చిత్రాంగదను. మణిపుర రాజకన్యను. తపస్సుచే సంతుష్టుడై, మా పితృవంశమున ఎన్నడును పుత్రిక

జన్మించకుండునటుల దేవదేవుడు ఉమాపతి వరమొసగెను. నేను ఆ మహావరమును వ్యర్థమొనర్చితిని. అమోఘమగు ఆ దేవవాక్యముకూడ మాతృగర్భమును చొచ్చి, నా దుర్బల ప్రారంభమును శైవతేజమున పురుషునిగ మార్చ జాలకపోయెను. అట్టి కఠినమగు నారిని నేను.

మదనుడు

అవును, అవును, వినియేయున్నాము. అందుననే నీ తండ్రి పుత్రసమానముగ నిన్ను పాలించుచున్నాడు. ధనుర్విద్యను రాజదండనీతిని నేర్పించెను.

చిత్రాంగద

అందుచే పురుషవేషమున స్వేచ్ఛగ తిరుగుచు, యువరాజరూపమున రాజ్యకార్యముల నిత్యము నిర్వహించు చుండెదను. లజ్జాభయములు, అంతఃపురవాసములు నాకు లేవు. హావభావములు, విలాసచాతుర్యములు నాకు తెలియవు.

ధనుర్విద్యను నేర్చితిని. దేవా, నీ పుష్పధనువును నయనాంచలముల ఎటుల వంచి, ఎక్కుబెట్టవలయునో మాత్రము నేను నేర్చుకొనలేదు.

వసంతుడు

సునయనా, ఆ విద్యను ఏ నారియు నేర్చుకొనదు. నయనములు తమ కార్యమును తామే చేయగలవు. ఎవని వక్షమున అవి నాటునో, వానికే అవి అర్థమగును.

చిత్రాంగద

ఒకదినము పూర్ణానదీతీరమునందలి సాంద్రారణ్యమున ఒంటరిగ మృగాన్వేషణార్థము వెడలితిని. తరుమూలమున అశ్వమును బంధించి, మృగపదచిహ్నముల అనుసరించుచు, దుర్గమ కుటిల వనపథమున ప్రవేశించితిని.

ఝిల్లీ మంద్రస్వన ముఖరితమును, నిత్య అంధకార యుతమును, లతాగుల్మములచే గహనగంభీరమునగు మహారణ్యమున కొంతదూరము ముందుకు పోగా, సంకీర్ణ పథమును నిరోధించి భూతలమున శయనించియున్న, మలినవస్త్రధారియైన పురుషుని హఠాత్తుగ కాంచితిని. అవజ్ఞాస్వరమున లేచి జరిగిపొమ్మని గద్దరించితిని.—అతడు కదలలేదు, తిరిగి చూడలేదు.

పొంగి పొరలుచున్న రోషమున, ధనురగ్రభాగముతో అతనిని కొట్టితిని;— భస్మసుప్తమగు అగ్ని ఘృతాహుతిని పొంది, శిఖారూపమున రెప్పపాటు కాలములో

భగ్గున పైకిలేచు విధమున, సరళదీర్ఘదేహముతో ఒక్క-ముహూర్తమున శరవేగమున లేచి, నా సమ్ముఖమున నిలువబడియెను.

క్షణకాలమే నా ముఖమువైపు చూచెను—అతని రోషదృష్టి అంతలోనే అంతర్ధానమాయెను; నా బాలక మూర్తిని చూచికాబోలు, మనోహర కౌతుక గుప్త మృదుహాసరేఖ అతని అధరప్రాంతమున నాట్యమాడెను.

పురుషుల విద్యను నేర్చి, పురుషుల వేషమును ధరించి, పురుషులతో కలసిమెలసి యుండి, ఇన్ని దినములుగా ఏ విషయమును మరచియుంటినో, దానిని—నేను ఒక నారినను విషయమును—అతని ముఖమును తిలకించి, తనలోతాను నిమగ్నమై యున్న ఆ అటల మూర్తిని వీక్షించి, ఆ క్షణముననే మనస్సునకు తెచ్చుకొంటిని.

ఆ ముహూర్తముననే ప్రథమ పర్యాయము పురుషుని నా సమ్ముఖమున కాంచితిని.

మదనుడు

ఆ శిక్షణ నాది, శుభాంగీ; ఒక దినమున జీవిత శుభపుణ్యక్షణమున, స్త్రీలకు స్త్రీలమను చైతన్యమును,

పురుషులకు పురుషులమను భావమును నేనే కలుగజేయు చున్నాను. తదుపరి ఏమాయెను?

చిత్రాంగద

సభయ విస్మయకంఠమున 'ఎవడవు నీవు' అని అడిగితిని. 'నేను పార్థుడను, కురువంశజాతుడను' అను ఉత్తరమును వింటిని.

చిత్రప్రాయముగ నిలువబడి యుంటిని, నమస్కరించుటకును మరచితిని. ఇతడా పార్థుడు? నా ఆజన్మ విస్మయుడు? సత్యపాలనకొరకు ద్వాదశ వత్సరములు అర్జునుడు అరణ్యావాసము చేయుచు, బ్రహ్మచర్యమును పాలించుచున్నాడని వినియుంటిని.

ఇతడేనా ఆ పార్థవీరుడు? "నిజ భుజబలమున పార్థ కీర్తిని నిష్ప్రభ గావించెదను, అవ్యర్థమగు లక్ష్యమును సాధించెదను, పురుషుని ఛద్మవేషమున అతనితో సంగ్రామమును కోరి, నా ప్రతాప పరిచయ మొసగెద" నని ఎన్నెన్ని సారులు నా బాల్యదురాశచే మనస్సున తలచితిని. అయ్యో, తెలివితక్కువదానా, నీ దుస్సాహసము ఎచటికి పోయెను? అతడు నిలిచియుండిన భూమిపై నే నొక తృణదళమునై యుండి యుండిన, నాకున్న శౌర్యపరాక్రమములను ధూళిలో

కలిపి, అతని ఆ చరణతలముననే దుర్లభ మరణమును పొందెడిదానను.

ఏమి ఆలోచించుచుంటినో జ్ఞప్తిలేదు. వీరుడు వనాంతరాళమునకు నెమ్మదిగ వెడలిపోవుటను చూచితిని. ఉలికిపడి లేచితిని, ఆ క్షణముననే చైతన్యము ఉదయించెను, నన్ను నేను వందసారులు దూషించుకొంటిని. ఛీ ఛీ మూఢురాలా, సంభాషింపకపోతివి, మంచి చెడ్డల తెలిసికొనకపోతివి, క్షమాభిక్షను కోరకపోతివి, అనాగరికవలె తత్తరపడి నిలిచియుంటివి.

—వీరుడు అవహేళనమున వెడలిపోయెను. ఆ ముహూర్తముననే మరణించియుండిన, బ్రతికిపోయెడిదానను.

మరునాడు ఉదయమున పురుషవేషమును దూరముగ పారవైచితిని. రక్తాంబరమును ధరించితిని. కంకణ కింకిణి కాంచీభూషితనైతిని. అలవాటులేని అలంకారములు లజ్జచే మిక్కిలి సంకోచమున నా అంగముల కప్పుచుండినవి.

రహస్యముగ ఆ వనమునకు చని, అరణ్యములోని శివాలయమున అతనిని నేను చూచితిని.

మదనుడు

యువతీ, తర్వాత విషయమును చెప్పుము. నావద్ద సిగ్గును పడవద్దు. నేను మనసిజుడను. సకల మనో రహస్యములు నాకు తెలియును.

చిత్రాంగద

తర్వాత నే నేమి అడిగితినో, ఎట్టి ఉత్తరముల వింటినో సరిగ జ్ఞప్తిలేదు. భగవాన్, ఇక నన్ను ప్రశ్నించకుము. లజ్జ వజ్రాయుధమువలె విరిగి నా శిరముపై బడినను, నన్ను నూరువ్రక్కలుగ చేయజాలకపోయెను. నారినైయుండియు, అట్టి పురుషప్రాణము నాది.

నేను దుఃస్వప్న విహ్వాలుని పోలె, ఇంటికి ఎటుల తిరిగి వచ్చితినో నాకు ఎరుకలేదు. 'బ్రహ్మచర్యవ్రతధారిని నేను, పతియోగ్యుడను కాను, వరాంగనా' అను అతని కడపటి మాటలు, తప్తశూలములై నా కర్ణముల పొడువ ప్రారంభించెను.

పురుషుని బ్రహ్మచర్యమా! ఛీ ఛీ, దానినిగూడ కదలించి సడలించలేకపోతినే! మీనకేతూ, ఎందరెందరు ఋషులు, మునులు నారీపదములకడ తమ చిరార్జిత తపః ఫలముల అర్పించిరో నీకు తెలియును.

క్షత్రియుని బ్రహ్మచర్యమా!

ఇంటికి వెళ్లి, ఉన్న ధనుశ్శరములనెల్ల విరిచి పార వైచితిని. ఇంతకాలము నాకు గర్వధనముగ నుండిన కిణాంకితమగు ఈ నా కఠినబాహువును నిష్ఫలాక్రోశభరితనై దూషింప దొడగితిని. నారినై పురుషుని మనమును జయించ లేకపోయిన, నా విద్యయంతయు వృథయని, ఇన్నాళ్లకు తెలిసికొంటిని.

అబలయొక్క ఆ కోమల, మృణాల బాహుద్వయము ఈ నా బాహువులకన్న శతాధికమగు బలమును కలిగి యున్నది.

తన త్రస్త నేత్రపాతమున పురుషుల పరాక్రమ శక్తిని, తపస్తేజమును పరాభూతమొనర్చు, ముగ్ధ మూఢ క్షీణతనులత పరావలంబిత లజ్జాభయలీనాంగి యగు ఆ సామాన్యలలన ధన్యురాలు.

అనంగదేవా, నా దంభములనెల్ల ఒక్కనిముసమున అణచివేసితివి. విద్య బలము సమస్తము నీ పదానతము చేసికొంటివి. ఇప్పుడు నీ విద్యను నాకు నేర్పుము.

నిరస్త్రునికి అస్త్రములవలె, ప్రబలనగు నాకు అబలల బలమును ప్రసాదింపుము.

మదనుడు

నేను నీకు సాయమొనర్చెదను. శుభాంగీ, విశ్వ విజయియగు అర్జునుని జయించి బందినిచేసి, నీ సమ్ముఖమునకు కొనితెచ్చెదను. రాణివై, నీ ఇష్టానుసారము అతనిని శిక్షచే బహూకరింపుము. ఆ విద్రోహిని శాసనబద్ధుని కావింపుము.

చిత్రాంగద

నాకు సమయము చిక్కిన, ఒంటరిగ నెమ్మది నెమ్మదిగ, దేవతల సహాయమును కోరకనే, వాని హృదయముపై ఆధిపత్యము సంపాదించెడిదానను.

వానితో కూడ నివసించుచు, సమరస్థలిని సారథినై, మృగయావినోదమున అనుచరరూపమున వెంబడించి, శిబిరము కడ రాత్రి ద్వారరక్షకుడనై మేల్కొని, భక్తవేషమున పూజించి, భృత్యువేషమున సేవించి, ఆర్తత్రాణ మహావ్రతమున క్షాత్రసహచరుడనై సహాయమొనర్చెడిదానను.

ఎప్పుడో ఒకనాడు, కుతూహలమున నావైపు తేరి చూచుచు 'ఎవడు ఈ బాలకుడు? నా పూర్వజన్మ సుకృతము వలె, ఈ జన్మమున నా సహవాసియై, చిరదాసుడైనాడు' అని మనస్సున తలంచును. క్రమక్రమముగ వాని హృదయ ద్వారమును తెరచి, అచ్చో శాశ్వతస్థానమును సంపాదించెడిదానను.

